ఓమ్!

శ్రీగురవే నమః

# శ్రావణీవిద్వత్సపర్యా

---

శ్రీమద్ధామా స్తకామా క్షితిమిహిరమణి
శ్రీకరద్వీపసీమా
సోమాదిస్తోమభూమ స్తుతివిదితజగత్
క్షోభిరక్షోతిభీమా
నామాంచత్కామభామా రచితనతిజగ
ద్రమ్యరూపాభిరామా
నామాం క్షేమపరిణామా మమహృదయగతా
పాతు బాలాంబనామా. ౧

సీ. ధాతకుమున్నుమ్రొక్క • దగు వేదరాసుల
నుపదేశ మేగున్నం • దోలఁ జేసె
సోమకుఁ డేచి యా • శ్రుతులఁ గొల్లాడంగ
నాగమంబుల నెవ్వఁ • డాది నుడివె

దీనానాథసమృద్ధిమాకిదెజగ
ద్విఖ్యాతినేతన్మహా
స్థానంబున్మదినెంతువాజ్ఞపకుని
న్నన్నార్యపిరాజాహ్వయున్. ౪

చ. మనమునఁజేయుదున్నతుల
మానుగ సత్కృతసత్కదంబకున్
బ్రాఘితపతివ్రతాత్వపరి
రంజితపూర్వసతీకదంబకున్
దినదినపూజ్యమానహృద
దీవరమాపరసాకలంబకున్
న్యనుమానసర్వదంభకు మ
దంబకు వేంకటసుబ్బమాంబకున్. ౫

శా. శ్రీమన్నామకమల్లికార్జునగురు
స్నేహింతు శైవాగమ
స్తోమార్థావగమావధూతభ్రమరు
కోకప్రబోధార్ద్రపుం
గామాంధీకృతహృద్గుహాంతరతమః
కాదంబినీఘానస
స్థేమానూననిశార్చనోదితవచ
స్సీతాకిరిద్యుంద్యూవిలున్.

సీసమాలిక.

తారకబ్రహ్మమై • తగును శ్రీమాంగింబు
మాయయన్వేశనిం • పొరుచుండ
వ్యాకరణాద్రి • నక్త్రింబు విజ్ఞాన
ఫాలనేత్రంబునఁ • బ్రబలుచుండ
జ్యోతిషచ్ఛందస్సు • లనసోగకన్నులు
శిక్షాంజనంబునఁ • జెలఁగుచుండఁ
గల్పనిరుక్తుల • నక్కర్ణముల్కమనీయ
నీతితాటంకకాంతి • నెగడుచుండ
ధర్మశాస్త్రంబులు • దగుమంజునాక్కలై
యోగమాధవశోభ • నలరుచుండ
నాల్గువేదంబులు • నవబాహులతికలై
కంకణత్కామాగ • కాంతినుండ
గానసాహిత్యము • లక్సదురోజంబులై
సుఖచందనస్ఫూర్తి • సొంపుగింపఁ
జంచచ్ఛిదాభాస • చారుమధ్యంబుపై
సజ్ఞానరోమాలి • యలరుచుండ
సాంఖ్యయోగంబులు • జఘనంబులై మించ
మీమాంసలూరులై • మెలఁగుచుండ
వైశేషికన్యాయ • వాదముల్జంఘలై
ధనురర్థశాస్త్రపా • దములు దనర

బ్రితిభయున్ శుద్ధచేలము • పరిఢవిల్ల
సకలసుజనులు వేదశా • స్త్రములతోడ
నలరి కొనియాడ మానుష • న్యమున నిడ
శ్రీవాణీదేవి మాకు సా • క్షాత్కరించె. ౭

ఉ. ముందర వేదపుస్తకము
మోదముతోనొక కేలఁ బూనియు
సుందరరాసభాసనుఁడు
సొంపుగ బుక్కిలు బాడుక్షీంకృతు
జ్జిందగ సత్కమాల్యములు
చిందరవందరలాడ సౌమ్యునా
చందనచారుదేహమున
సాకొని యూడుబుగాఖ్యపూరుషున్. ౮

ఉ. లోలతఁగర్మలెన్నిడుచు
లోకులదండనఁజేయుకై పడిం
గేలనువాలుఁబూనిపల
కేలజపాక్షసరంబుఁగూర్చియుం
బోలనజాన్యుఁడై మిగులఁ
బోడిమిగల్గినకోమ్ములూచునా
బాలదినాకరోపముని
బాపెద నే యుఁగాఖ్యపూరుషున్. ౯

జనచేతఃపరిశుద్ధిసాధనముగా
సాధించి బ్రాహ్మణ్యమున్
మనిపెంగాపునఁ బూర్వమైయెసఁగు నీ
మాంసా నిమంగొల్చెదన్. ౧౨

మ. నరగంటి త్రిపిశుద్ధ్యసంతిరమున
న్సంసారమేలాచనున్
బరసంశోధనలేకయుంచు బహుధా
వ్యాసుండు తిర్కొంచినన్
గిరగిల్వం బగిము క్త్రిరత్నపివశిన్
గాంచెంబ్రహ్మంబు ను
తిరమీమాంస! మదానతుల్ గొనుచునన్
ధన్యాత్ముఁగాపింపవే. ౧౩

ఉ. సార్థకశబ్దముల్ నుడువఁ
జాలుదురేని ఫలంబనంతమా
వ్యర్థమనర్థమానుగద
యంచు మనంబునగౌతముండు ని
స్వార్థవిచారసారగుణ
హారిపరిష్కృతిరత్నసుస్ఫుర
ద్గ్రంథపద్ధతిన్నుడివె
మస్కృతిశాస్త్రమ ! న్యాయశాస్త్రమా ! ౧౪

సామోపాయతంత్రచణంబులును మన
స్సంశోధనం బాదిగా
నేమంబొప్పంగఁ గాంచె యోగము! మది
న్నేసంతోసిని స్నేహభవున్. ౧౭

సీ. ఋగ్వేదవిజ్ఞాన ♦ రేచితపాపులై
పేరందియున్నయో ♦ పెద్దలార!
యజురాఖ్యవేదవి ♦ ద్ద్విజపుణ్యమూర్తులై
ఘనజటల్పఠియించు ♦ గణ్యులార!
సామగానానూన ♦ సంపన్నకాములై
సోమునారాధించు ♦ సుజనులార!
బ్రహ్మాథర్వణామ్నాయ ♦ బోధసిద్ధులై
మంత్రముల్ జపియించు ♦ మాన్యులార!
ధర్మవిజ్ఞానులార! వే ♦ దాంతులార!
న్యాయవైశేషికార్థసం ♦ ధాతలార!
సాంఖ్యయోగాదిగతిలబ్ధ ♦ సత్త్వులార!
నానశాస్త్రములందుఁడి ♦ జ్ఞాతలార! ౧౮

తే. స్వాగతమనూన ♦ సత్కృపావరులార!
స్వాగతము స్వచ్ఛపవి ♦ చారులార!
స్వాగతమతిమాత్ర ♦ సమ్మోదకరులార!
స్వాగతమత్యంత ♦ శాంతులార!

స్వాగతము సేత • సద్గుణాకరులార!
స్వాగతము సద్వ్య • సనులార!
స్వాగతమునీంద్ర • సమూర్తఘనులార!
స్వాగతమతిలోక • సాధులార!
ధీరులార! దురాతంక • దూరులార!
వేదశాస్త్రార్థవిజ్ఞాన • విమలులార!
ధర్మతత్పరతాభూతి • దర్పులార!
స్వాగతము మీకు నిర్మలా • చారులార! ౧౬

శ్రమము సకోర్చి దూరమని
సందియ మొందక మీరు నాపయిన్
విమల దయోదయంబమరఁ
బిచ్చుక గుంపయిన్న రాపగో
త్తమసలిలంబు వారిసవి
ధాన సిటన్ జనుదెంచినారలో
యమలమతుల్ గుణున్మదము
సాదరగ జేసితిరీ సస్నహా. ౨౦

కన్న సాదంబుసఁ • గానరాకుండెడి
గాలిములార ని • ష్కళుషులార
యానసం బలునాల్గు • గాసంగరానట్టి
భాసురమూర్తులౌ • బ్రహ్మలార

వదనసహస్రంబు • వదలి యిప్పాటమిన్నై
సేవించుచున్నాఁడ • శేషుండ్రులార
యింద్రపురోధస్స్వ • మేసగించి
మనుష్యదేహ మొందినయట్టి • ధిషణులార
ధన్యుఁడను నేను భవదీయ • దర్శనమునఁ
బూని మాకాశీర్వదించుఁడీ • పుణ్యులార
నతిశిరస్కుఁడనై మీకు • నతులొనర్తు
సతులతోడను సుతతోడ • సుతులతోడ. ౨౧

అంతరంగగూఢ • హరిశీలసమతమ
స్తంభభానుండు మీ • దర్శనంబు
పూర్వజన్మార్జిత • పుణ్యపుంజవిపాక
తరుఫలోపమము మీ • దర్శనంబు
నానాంగసంజాత • దుర్వారగర్వసూక్తి
తాతినిరోధకము మీ • దర్శనంబు
దారుణపాపౌఘ • దంభభూభృత్కోటి
దంభోళిసమము మీ • దర్శనంబు
తతమహోదయపదము మీ • దర్శనంబు
దారితాపారభవము మీ • దర్శనంబు
దళితదుర్గుణాగణము మీ • దర్శనంబు
ధరను సామాన్యమగునె మీ • దర్శనంబు. ౨౨

సీ. దర్శనీయంబు మీ • తనువు దర్శించి నా
కనులు సత్కృతంపుఁ • గనులు కావె
శ్రోత్రవ్యములు మీదు • పూతవాక్కులు విని
శ్రుతులు భద్రశ్రవ • శ్రుతులు గావె
పూజ్యులౌ మీ పాద • పూజలొనర్చి నా
కరము సత్కర్మకరౌ • కరము గాదె
సంపాద్య భవదీయ • సంగలాభంబున
మనము సంప్రాప్తకా • మనము గాదె
మామకోక్తియు భవదుక్తి • తో మెలఁగుచు
సర్వగౌరవపటిమచే • నలరుఁ గాదె
వేద వేదాంగ వేదాంత • విజ్ఞులార!
ధన్యుఁడను ధన్యతరుఁడను • ధన్యతముఁడ. ౨౩

మ. దయతో మామకసత్కృతుల్ గని ననున్
ధన్యాత్ముఁగాఁ జేసి దు
ర్నయదుఃఖౌఘనివృత్తికారణముగా
న్యాయోక్తులన్ దన్పి యా
మయభూతాఖిలమోహముల్సడలఁగా
మమ్మున్ గటాక్షించి వి
ప్రియముల్ద్రోలి దయార్ద్రనేత్రములతోఁ
బ్రసన్నులం జూడరే. ౨౪

శా. యుష్మత్పాదరజఃపరిభావమున నీ
యుర్విన్ సత్ప్రహాసంపదా
యుష్మత్త్వంబులుగల్గు, నీల్గును చల
ద్ధంకారిధరాత్రిరా
డ్భీషాత్ప్రగతకింకరార్భటులనన్,
భీమాంతతాపత్రయా
త్యుష్మత్ప్రాప్తాలలనన్ [illegible]ంభలరఁగా
నూహింధు టాశ్చర్యమే. ౨౪

ఉ. కోరికలెన్నియేనియును
గోరఁగవచ్చును గాని నామదిం
గోరికయొంకుదక్క మఱి
కోర్కెలికేమియు లేవు సన్నుతా
చారధురీణులార! యని
శంబును నిచ్చట శారివణీమహాం
బీరవణిన్బరికాశిలుట
కింపుగ ధీరలనుగ్రహింపుఁడీ. ౨౫

ఉ. ఊర్జితభావసంపదల
నొప్పి జగత్పరిపాలకత్వవి
స్ఫూర్జితసత్ప్రతాపపరి
భూతరిపుక్షితిపాలపట్టణా

పార్జితసర్వసంపదతి
పాత్రికినామసచక్రవర్త్తికిన్
జార్జికి మేరిరాణికి న
జనప్రియమ్ముప్రగాతనీయునిక్. 92

విజ్ఞాపనము.

సీ. లక్ష్మీప్రసాదభూ • లలనాప్రియూడ్ఞ చేఁ
బరిబూనియూ రేని • ప్రతిగ నేను
పద్యరత్నములుచం • పకపుతాపులనించి
పదమౌక్తికములతోఁ • బాదుకొలిపి
యుత్పలంబులకాంతు • లాలయంగనమకూర్చి
పొందుగశయ్యపైఁ • బాదుపఁజేసి
గుణమునఁగుదురుగా • గోమపొప్పగుంభించి
నక్షత్రమాలను • నాఁణెముగను
జేసెమీకిడిసుకృతముఁ • జెందినాఁడ
నేకదాస్థానమాన్యుఁడ • నింపుతోఁడ
విలసదాత్రేయసంతతి • వెలయువాఁడ
ధరనుసీతయశాస్త్రినాఁ • దనరువాఁడ.

ఇట్లు సుజనవిధేయుఁడు,
కంమకూరి లక్ష్మీప్రసాదరావు.



